**శతకం:**

శ్రీ రుక్మిణీశ కేశవ

నారద సంగీత లోల నగధర శౌరీ

ద్వారక నిలయ జనార్ధన

కారుణ్యము తోడ మమ్ము గావుము కృష్ణా॥1॥

నీవే తల్లివి దండ్రివి

నీవే నా తోడునీడ నీవే సఖుడౌ

నీవే గురుడవు దైవము

నీవే నా పతియు గతియు నిజముగ కృష్ణా॥2॥

నారాయణ పరమేశ్వర

ధారాధర నీలదేహ దానవ వైరీ

క్షీరాబ్ధిశయన యదుకుల

వీరా ననుగావు కరుణ వెలయగ కృష్ణా॥3॥

హరి యను రెండక్షరములు

హరియించును పాతకముల నంబుజనాభా

హరి నీ నామ మహాత్మ్యము

హరి హరి పొగడంగ వశమె హరి శ్రీకృష్ణా॥4॥

క్రూరాత్ముడజామీళుఁడు

నారాయణ యనుచు నాత్మనందను బిలువన్

ఏ రీతి నేలుకొంటివి

యేరీ నీసాటి వేల్పు లెందును కృష్ణా॥5॥

చిలుక నొక రమ  ణి ముద్దులు

చిలుకను శ్రీరామయనుచు శ్రీపతి పేరుం

బిలిచిన మోక్షము నిచ్చితివ

వలరగ మిము దలఁచు జనులకరుదా కృష్ణా॥6॥

అకౄరవరద! మాధవ!

చక్రాయుధ! ఖడ్గపాణి! శౌరి! ముకుందా!

శక్రాది దివిజ సన్నుత!

శుక్రార్చిత! నన్ను కరుణ జూడుము కృష్ణా!॥7॥

నందుని ముద్దుల పట్టిని

మందరగిరిధరుని హరిని మాధవు విష్ణున్

సుందరరూపుని మునిగణ

వందితు నిను దలంతు భక్తవత్సల! కృష్ణా!॥8॥

ఓ కారుణ్య పయోనిధీ!

నా కాధారంబ వగుచు నయముగ బ్రోవన్

నాకేల ఇతర చింతలు

నాకాధిప వినుత! లోకనాయక కృష్ణా!॥9॥

వేదంబులు గననేరని

ఆది పరబ్రహ్మమూర్తివనఘ! మురారీ;

నా దిక్కు చూచి కావుము

నీ దిక్కే నమ్మినాడ నిజముగ కృష్ణా!॥10॥

పదునాలుగు భువనంబులు

కుదురుగ నీకుక్షి నిల్పుకొను నేర్పరివై

విదితంబుగ నా దేవకి

యుదరములో నెట్టులొదిగి యుంటివి కృష్ణా! ||11||

అష్టమి రోహిణి ప్రొద్దున

అష్టమ గర్భమునఁ బుట్టి యా దేవకికిన్

దుష్టుని కంసు వధింపవె

సృష్టి ప్రతిపాలనంబు సేయఁగ కృష్ణా! ||12||

అల్ల జగన్నాథుకు రే

పల్లియ క్రీడార్థమయ్యె పరమాత్మునకున్

గొల్లసతి యా యశోదయుఁ

తల్లియునై చన్నుగుడిపెఁ దనరగ కృష్ణా! ||13||

అందెలు గజ్జెలు మ్రోయఁగ

చిందులు ద్రొక్కుచును వేడ్క చెలువారంగా

నందునిసతి యా గోపిక

ముందఱ ఆడుదువు మిగుల ముఱియుచు కృష్ణా! ||14||

హరిచందనంబు మేనునఁ

గర మొప్పెడు హస్తములను కంకణరవముల్

ఉరమున రత్నము మెఱయఁగ

పరఁగితివో నీవు బాలప్రాయము కృష్ణా ||15||

పాణి తలంబున వెన్నయు

వేణీమూలంబునందు వెలయఁగఁ పింఛం

బాణీముత్యము ముక్కున

నాణెముగా దాల్చు లోకనాథుడ కృష్ణా! ||16||

మడుగుకు జని కాళీయుని

పడగలపై భరతశాస్త్ర పద్ధతి వెలయన్

కడు వేడుకతో నాడెడు

నడుగులు నా మదిని దలతు నచ్యుత! కృష్ణా! ||17||

బృందావనమున బ్రహ్మా

నందార్భకమూర్తి వేణు నాదము నీవా

మందార మూలమున గో

విందా! పూరింతు వౌర! వేడుక కృష్ణా! ||18||

వారిజనేత్రలు యమునా

వారిని జలకంబులాడ వచ్చిన నీవా

చీరలు మ్రుచిలి యిచ్చితి

నేరుపురా యదియు నీకు నీతియె కృష్ణా! ||19||

దేవేంద్రుఁ డలుకతోడను

వావిరిగా ఱాళ్లవాన వడిఁ గురియింపన్

గోవర్ధనగిరి యెత్తితి

గోవుల గోపకులఁ గాచు కొఱకై కృష్ణా! ||20||

అండజవాహన! విను బ్ర

హ్మాండంబుల బంతులట్ల యాడెడి నీ వా

కొండల నెత్తితివందురు

కొండిక పనిగాక దొడ్డకొండా! కృష్ణా! ॥21॥

అంసాలంబితకుండల!

కంసాంతక! నీవు ద్వారకాపురిలోనన్

సంసారిరీతి నుంటివి.

హంసేంద్ర! విశాలనేత్ర! అచ్యుత కృష్ణ! ॥22॥

పదియాఱు వేల నూర్వురు

సుదతులు నెనమండ్రు నీకు సొంపుగ భార్యల్

విదితంబుగ బహురూపుల

వదలక రమియింతువౌర ! వసుధను కృష్ణా! ॥23॥

అంగన పసుపున దోవతి

కొంగున నటుకులను ముడిచి కొనివచ్చిన యా

సంగతి విని దయ నొసఁగితి

రంగుగ సంపదలు లోక రక్షక కృష్ణా! ॥24॥

హా వసుదేవకుమారక!

కావుము నా మానమనుచుఁ గామిని వేఁడన్

ఆ వనజాక్షికి నిచ్చితి

శ్రీవర! యక్షయ మటంచుఁ జీరలు కృష్ణా! ॥25॥

శుభ్ర మగు పాంచజన్యము

నభ్రంకషపగిది మ్రోవ నాహవ భూమిన్

విభ్రము లగు దనుజసుతా

గర్భంబులు పగులఁజేయు ఘనుఁడవు కృష్ణా! ॥26॥

జయమును విజయున కియ్యవె

హయముల ములుకోలమోపి యదలించి మహా

రయమున ఓొప్పవె తేరును

భయమున రిపుసేన విఱిగి పాఱగ! కృష్ణా! ॥27॥

దుర్జనులగు నృపసంఘము

నిర్జింపగఁదలచి నీవు నిఖిలాధారా!

దుర్జనులను వధియింపను

అర్జునునకు నీవు సాదివైతివి కృష్ణా! ॥28॥

శక్రసుతుఁ గాచు కొఱకై

చక్రము చేపట్టి భీష్ముఁ జంపగ జను నీ

విక్రమ మేమని పొగడుదు

నక్రగ్రహా! సర్వలోక నాయక కృష్ణా! ॥29॥

దివిజేంద్రసుతునిఁ జంపియు

రవిసుతు రక్షించినావు రఘురాముడవై

దివిజేంద్ర సుతుని గాచియు

రవిసుతుఁ బరిమార్చితౌర! రణమున కృష్ణా! ॥30॥

దుర్భరబాణము రాగా

గర్భములోనుండి అభయ కావుమటన్నన్

నిర్భరకృప రక్షించితి

వర్భకు నభిమన్యుసుతుని నచ్యుత కృష్ణా! ||31||

గిరులందు మేరు వౌదువు

సురలందున నింద్రుఁడౌదు చుక్కలలోనన్

బరమాత్మ! చంద్రుఁడౌదువు,

నరులందున నృపతివౌదు నయముగ కృష్ణా! ||32||

చుక్కల నెన్నగ వచ్చును

గ్రక్కున భూ రేణువులను గణుతింపనగున్

జొక్కపు నీ గుణజాలము

నక్కజ మగు లెక్కబెట్ట నజునకు కృష్ణా! ||33||

కుక్షిని సకలజగంబుల

నిక్షేపముఁజేసి ప్రళయనీరధి నడుమన్

రక్షక! వటపత్రముపై

దక్షతఁ బవళించినట్టి ధన్యుఁడ కృష్ణా! ||34||

విశ్వోత్పత్తికి బ్రహ్మవు

విశ్వము రక్షింపఁ దలచి విష్ణుడవనఁగా

విశ్వముఁ జెఱుపను హరుడవు

విశ్వాత్మక! నీవెయగుచు వెలయుదు కృష్ణా! ||35||

అగణిత వైభవ! కేశవ!

నగధర! వనమాలి! యాది నారాయణ! యో

భగవంతుడ! శ్రీమంతుడ!

జగదీశ్వర! శరణు శరణు శరణము కృష్ణా! ॥36॥

మగ మీనమవై జలనిధి

జగతుని సోమకుని జంపి పద్మభవునకున్

నిగమములు దెచ్చి యిచ్చితి

సుగుణాకర మేలు దివ్యసుందర కృష్ణ! ॥37॥

అందఱు సురలును దనుజులు

పొందుగ క్షీరాబ్ధిఁ దరుప పొలుపున నీ వా

నందముగా కూర్మమవై

మందరగిరి యెత్తితౌర! మాధవ కృష్ణా! ॥38॥

ఆది వరాహుడవయి నీ

వా దనుజు హిరణ్యనేత్రు హతుఁ జేసి తగన్

మోదమున సురలు వొగడఁగ

మేదిని వడిగొడుగునెత్తి మెరసితి కృష్ణా! ॥39॥

కెరలి యఱచేత కంబము

నరుదుగ వేయుటయు వెడలి యసురేశ్వరునిన్

ఉరము జీరి వధించితి

నరహరి రూపావతార! నగధర కృష్ణా! ॥40॥

వడుగడవై మూడడుగుల
నడిగితివౌ భళిర భళిర అఖిలజగంబుల్
తొడిగితివి నీదు మేనున
కడు చిత్రము నీ చరిత్ర ఘనమవు కృష్ణా! ||41||

ఇరువదొకమాఱు నృపతుల
శిరములు ఖండించితౌర! చేగొడ్డంటన్
ధర కశ్యపునకు నిచ్చియు
బరగవె జమదగ్ని రామభద్రుడ కృష్ణా! ||42||

దశకంఠుని బరిమార్చియు
కుశలముతో సీత దెచ్చికొనియు నయోధ్యన్
విశదముగఁగీర్తినేలిన
దశరథరామావతార! ధన్యుఁడ కృష్ణా! ||43||

ఘనులగు ధేనుకముష్టిక
దనుజులఁ జెండాడితౌర తగ భుజశక్తిఁ
అనఘాత్మ! రేవతీపతి
యనఁగా బలరామమూర్తి వైతివి కృష్ణా! ||44||

త్రిపురాసుర భార్యల నతి
నిపుణతతో వ్రతముచేత నిలిపితి కీర్తుల్
కపటపు రాజవు బళిరే
కృపగల బౌద్ధావతార ఘనుడవు కృష్ణా! ||45||

వలపుల తేజీ నెక్కియు

నిలపై ధర్మంబు నిలువ హీనులఁ ద్రుంపన్

కలియుగము తుదిని వేడుక

కలికివిగానున్న లోక కర్తవు కృష్ణా! ||46||

వనజాక్ష! భక్తవత్సల

ఘనులగు త్రైమూర్తులందుఁ గరుణానిధివై

మను నీ సద్గుణజాలము

సనకాది మునీంద్రు లెన్నజాలరు కృష్ణా! ||47||

అపరాధ సహస్రంబుల

నపరిమితములైన యఘము లనిశము నేనున్

గపటాత్ముఁడనై చేసితిఁ

జపలుని ననుఁగావు శేషశాయివి కృష్ణా! ||48||

నరపశువు మూఢచిత్తుడ

దురితారంభుఁడను మిగుల దోషగుఁడను నీ

గుఱుతెఱుఁగ నెంతవాఁడను

హరి నీవే ప్రాపు దాపు నౌదువు కృష్ణా! ||49||

పరనారీ ముఖపద్మము

గురుతుఁగ గుచకుంభములను గొప్పును నడుమున్

అరయంగనె మోహింతురు

నిరతిని నిను భక్తిఁ గొల్వ నేరరు కృష్ణా! ||50||

పంచేంద్రియ మార్గంబుల

కొంచెపు బుద్ధినిఁ జరింతుకొన్ని దినంబుల్
ఇంచుక సజ్జన సంగతి
నెంచగ మిమ్మెఱిఁగినాఁడ నిప్పుడు కృష్ణా! ॥51॥

దుష్టుఁడ దురాచారుఁడ
దుష్ట చరిత్రుఁడను జాల దుర్బుద్ధిని నే
నిష్ట నినుఁ గొల్వనేరను
కష్టుఁడను ననుఁ గావు కావు కరుణను కృష్ణా! ॥52॥

కుంభీంద్ర వరద! కేశవ!
జంభాసుర వైరి దివిజ సన్నుత చరితా!
అంభోజనేత్ర! జలనిధి
గంభీరా నన్నుగావు కరుణను కృష్ణా! ॥53॥

దిక్కెవ్వరు ప్రహ్లాదుకు
దిక్కెవ్వరు పాండు సుతుల దీనుల కెపుడున్
దిక్కెవ్వరయ్యహల్యకు
దిక్కెవ్వరు నీవె నాకు దిక్కువు కృష్ణా! ॥54॥

హరి! నీవె దిక్కు నాకును
సిరితో నేతెంచే మకరి శిక్షించి దయన్
బరమేష్టి సురలు పొగడఁగఁ
గరిఁగాచినరీతి నన్నుఁ గావుము కృష్ణా! ॥55॥

పురుషోత్తమ! లక్ష్మీపతి!
సరసిజగర్భాదిమౌని సన్నుత చరితా!

మురభంజన! సురరంజన!

వరదుఁడ వగు నాకు భక్తవత్సల! కృష్ణా! ।56॥

క్రతువులు తీర్థాటనములు

వ్రతములు దానములు సేయవలెనా లక్ష్మీ

పతీ! మిముఁ దలచినవారికి

నతులిత పుణ్యములు గలుగుటరుదా? కృష్ణా! ॥57॥

స్తంభమున వెడలి దానవ

డింభకు రక్షించినట్టి రీతిని వెలయన్

అంభోజ నేత్ర! జలనిధి

గంభీరుఁడ! నన్నుఁగావు కరుణను కృష్ణా! ॥58॥

శతకోటిభాను తేజుఁడ!

యతులిత సద్గుణగణాఢ్య యంభుజనాభా!

రతినాథ జనక! లక్ష్మీ

సతిహిత! ననుగావు భక్తవత్సల కృష్ణా! ॥59॥

మందుఁడ నేదురితాత్ముఁడ

నిందల కొడిగట్టినట్టి నీచుని నన్నున్

సందేహింపక కావుము

నందుని వరపుత్ర! నిన్ను నమ్మితి కృష్ణా! ॥60॥

గజరాజ వరద! కేశవ!

త్రిజగత్కల్యాణమూర్తి! దేవమురారీ!

భుజగేంద్ర శయన! మాధవ

విజయాప్తుఁడ! నన్నుఁగావు వేడుక కృష్ణా! ||61||

గోపాల దొంగ మురహర

పాపాలను బాఱఁద్రోలు ప్రభుఁడవు నీవే

గోపాలమూర్తి! దయతో

నా పాలిటఁ గలిగి ప్రోవు నమ్మితి కృష్ణా! ||62||

దుర్వార చక్రధర కర!

శర్వాణీ ప్రముఖ వినుత! జగదాధారా!

నిర్వాణనాథ! మాధవ!

సర్వాత్మక! నన్ను గావు సరుగున కృష్ణా! ||63||

సుత్రామనుత! జనార్దన!

సత్రాజిత్తనయనాథ! సౌందర్యకళా

చిత్రావతార! దేవకి

పుత్రా! ననుఁగావు నీకుఁ బుణ్యము కృష్ణా! ||64||

బల మెవ్వఁడు కరిబ్రోవను

బల మెవ్వఁడు పాండుసుతుల భార్యను గావన్

బలమెవ్వఁడు రవిసుతునకు

బలమెవ్వఁడు నాకు నీవు బలమౌ కృష్ణా! ||65||

పరుసము సోఁకిన యినుమును

వరుసగ బంగారమైన వడుపున జిహ్వాన్

హరి నీ నామము సోకిన

సురవందిత! నేను నటుల సులభుఁడ కృష్ణా! ||66||

ఒకసారి నీదు నామము

ప్రకటముగాఁ దలఁచువారి పాపప్కు లెల్లన్

వికలములై తొలఁగుటకును

సకలాత్మ యజామిళుండు సాక్షియె కృష్ణా! ||67||

హరి సర్వంబునన్ఁ గలఁడని

గరిమను దైత్యుండు పలుక గంబములోనన్

ఇరవొంద వెడలి చీల్పవె

శరణనఁ బ్రహ్లాదకుండు సాక్షియె కృష్ణా! ||68||

భద్రార్చిత పదపద్మ! సు

భద్రాగ్రజ! సర్వలోకపాలన! హరి! శ్రీ

భద్రాధిప! కేశవ! బల

భద్రానుజ! నన్నుఁబ్రోవు భయహర కృష్ణా! ||69||

ఎటువలెఁ గరిమొఱ వింటివి

యెటువలెఁ బ్రహ్లాదు కభయ మిచ్చితి కరుణన్

అటువలె నను రక్షింపుము

కటకట! నిను నమ్మినాఁడ గావుము కృష్ణా! ||70||

తటపట లేటికిఁ జేసెదు

కటకట పరమాత్మ నీవు ఘంటాకర్ణున్

ఎటువలె నిపుణునిఁ జేసితి

నటువలె రక్షింపుమయ్య యచ్యుత కృష్ణా! ||71||

తురగాధ్వరంబు జేసిన

పురుషులకును వేఱె పదవి పుట్టుట యేమో

హరి! మిముఁ దలచిన వారికి

నరుదా కైవల్య పదవి యచ్యుత కృష్ణా! ॥72॥

ఓ భవనంధ విమోచన!

యో భరతా గ్రజ! మురారి! యోరఘు రామా!

యో భక్త కామధేనువ!

యో భవహర! నన్నుఁగావుమో హరి కృష్ణా! ॥73॥

ఏ తండ్రి కనక కశ్యపు

ఘాతకుఁడై యతని సుతుని గరుణను గాచెన్

బ్రీతి సురకోటి పొగడఁగ

నా తండ్రీ! నిన్ను నేను నమ్మితి కృష్ణా! ॥74॥

ఓ పుండరీకలోచన!

యో పురుషోత్తమ! ముకుంద! యో గోవిందా!

యో పురసంహార మిత్రుడ!

యో పుణ్యుఁడ! నన్నుఁ బ్రోవు మో హరికృష్ణా! ॥75॥

ఏ విభుఁడు ఘోర రణమున

రావణు వధియించి లంక రాజుగ నిలిపెన్

దీవించి యా విభీషణు,

నా విభు నేఁ దలఁతు మదిని నచ్యుత కృష్ణా! ।76॥

గ్రహభయదోషముఁ బొందదు

బహుపీడలు చేర వెఱచుఁ బాయును నఘముల్

ఇహపర ఫలదాయక విను,

తహతహలెక్కడివి నిన్నుఁ దలచిన కృష్ణా! ॥77॥

గంగ మొదలైన నదులను

మంగళముగఁ జేయునట్టి మజ్జనమునకున్

సంగతి గలిగిన ఫలములు

రంగుగ మిముఁ దలచుఁ సాటి రావుర కృష్ణా! ॥78॥

ఆ దండ కావనంబునఁ

గోదండముఁ దాల్చినట్టి కోమలమూర్తీ!

నాదండ కావరమ్మీ

వేదండముఁ గాచినట్టి వేల్పవు కృష్ణా! ॥79।

చూపుము నీ రూపంబును

బాపవు దుష్కృతములెల్లఁ బంకజనాభా!

పాపుము నాకును దయతో

శ్రీపతి! నిను నమ్మునాఁడ సిద్ధము కృష్ణా! ॥80॥

నీ నామము భవహరణము

నీ నామము సర్వసౌఖ్య నివహాకరంబున్

నీనామ మమృత పూర్ణము

నీ నామము నేఁ దలంతు నిత్యము కృష్ణా! ॥81॥

పరులను నడిగిన జనులకుఁ

గురుచ సుమీ ఇది యటంచు గు!రుతుగ నీవున్

గురుచ్ఁడవై వేడితి మును

ధ్రఁ బాదత్రయము బలిని దద్దయు కృష్ణా! ॥82॥

పాలను వెన్నయు మ్రుచ్చిలఁ

ఱోలను మీ తల్లి గట్ట రోషముతోడన్

లీలావినోదివైతివి

బాలుఁడవా బ్రహ్మఁగన్న ప్రభుఁడవు కృష్ణా! ॥83॥

రఘునాయక నీనామము

లఘుమతితోఁ దలఁపఁగలనె లక్ష్మీరమణా!

అఘములఁ బాపుము దయతో

రఘురాముఁడ వైన లోక రక్షక కృష్ణా! ॥84॥

అప్పా! యిత్తువు దయతో

నప్పాలను నతిరసంబు లనుభవశాలీ

అప్పా! ననుఁ గన్గొనవే

యప్పా! ననుఁ బ్రోవు వేంకటప్పా! కృష్ణా! ॥85॥

కొంచెపువాఁడని మదిలో

నుంచకుమీ వాసుదేవ! గోవింద! హరీ!

యంచితముగ నీ కరుణకుఁ

గొంచెము నధికంబు గలదె కొలతయు కృష్ణా! ॥86॥

వావిరి నీ భక్తులకున్

గావరమున నెగ్గు సేయు గర్వాంధులనున్

దేవ! వధించుట వింటివి

నీ వల్లను భాగ్యమయ్యె నిజముగ కృష్ణా! ||87||

అయ్యా! పంచేంద్రియములు

నుయ్యాలల నూచినట్టు లూచఁగ నేనున్

జయ్యన్ గలుచుఁచు నుంటిని

గుయ్యాలింపుము మహాత్మ గుఱుతుగ కృష్ణా! ||88||

కంటికి రెప్పవిధంబున

బంటుగదా యనుచు నన్నుఁ బాయక యెపుడున్

జంటయు నీవుండుట నే

కంటక మగు పాపములను గడచితి కృష్ణా! ||89||

యమునకు నిఁక నే వెఱువను

కమలాక్ష! జగన్నివాస! కామితఫలదా!

విమల మగు నీదు నామము

నమరఁగఁ దలఁచెను వేగ ననిశము కృష్ణా! ||90||

దండమయా! విశ్వంభర!

దండమయా! పుండరీక దళనేత్ర హరీ!

దండమయా! కరుణానిధి!

దండమయా! నీకు నెపుడు దండము కృష్ణా! ||91||

నారాయణ! లక్ష్మీపతి!

నారాయణ! వాసుదేవ! నందకుమారా!

నారాయణ! నిను నమ్మితి!

నారాయణ! నన్నుఁ బ్రోవు నగధర కృష్ణా! ||92||

తిరుమణి దురితవిదూరము

తిరుమణి సౌభాగ్యకరము త్రిజగములందున్

తిరుమణి పెట్టిన మనుజుఁడు

పరమ పవిత్రుండు భాగ్యవంతుంఁడు కృష్ణా! ||93||

శ్రీలక్ష్మీనారాయణ!

వాలాయము నిన్నుఁ దలఁతు వంద్యచరిత్రా!

ఏలుము నను నీ బంటుగఁ

జాలఁగ నిను నమ్మినాను సరసుఁడ కృష్ణా! ||94||

శ్రీధర! మాధవ! యచ్యుత!

భూధర! పురుహూత వినుత! పురుషోత్తమ! నీ

పాద యుగళంబు నెపుడు

మోదముతో నమ్మినాఁడ ముద్దుల కృష్ణా! ||95||

శిరమున రత్నకిరీటము

కరయుగమున శంఖచక్ర ఘనభూషణముల్

ఉరమున వజ్రపుఁ బతకము

సిరినాయక! యమరవినుత శ్రీహరి కృష్ణా! ||96||

అందెలఁ బాదము లందును

సుందరముగ నిల్పినావు సొంపమరంగా

సుందర! మునిజనసన్నుత!

నందుని వరపుత్ర! నిన్ను నమ్మితి కృష్ణా! ||97||

కందర్పకోటి సుందర!

మందరధర! భానుతేజ! మంజుల దేహా!

సుందర విగ్రహ! మునిగణ

వందిత, మిముఁ దలతు భక్తవత్సల కృష్ణా! ||98||

దుర్మతిని మిగుల దుష్టపుఁ

గల్మషములు జేసినట్టి కష్టుండ ననున్

నిర్మలునిఁ జేయవలె ని

ష్కర్ముఁడ నిను నమ్మినాను సతతము కృష్ణా! ||99||

అనుదినము కృష్ణశతకము

వినినఁ బఠించినను ముక్తి వేడుకఁ గలుగున్

ధనధాన్యము గోగణములు

తనయులు నభివృద్ధి బొందుఁ దద్దయ కృష్ణా! ||100||

భారద్వాజసగోత్రుఁడ

గారవమున గంగమాంబ కరుణాసుతుఁడన్

పేరు నృసింహ్వాయుఁడను

శ్రీరమయుత! నన్నుఁ గావు సృష్టిని కృష్ణా! ||101||

- 

## వనరులు




వికీపీడియా లో వ్యాసం: **నరసింహ కవి**

| శతకములు |
| --- |
| శ్రీ కాళహస్తీశ్వర శతకము \| వేమన శతకము \| సుమతీ శతకము \| దాశరథీ శతకము \| భాస్కర శతకము \| భర్తృహరి శతకములు \| నారాయణ శతకము \| కృష్ణ శతకము \| ఆంధ్ర నాయక శతకము \| నరసింహ శతకము \| రామలింగేశ శతకము \| వృషాధిప శతకము \| మారుతి శతకము \| దేవకీనందన శతకము \| గువ్వలచెన్న శతకము \| కుమార శతకము \| కుమారీ |

# ఈ డిజిటల్ విడుదల గురించి

ఈ ఎలెక్ట్రానిక్ పుస్తకం (ఈ-పుస్తకం) వికీసోర్స్ అంతర్జాల గ్రంథాలయం [1]. అన్ని ప్రచురణలు, నవలలు, కవితలు,పత్రికలు, లేఖలు .. ఉచితంగా అందుబాటులో తేవాలన్న లక్ష్యంతో స్వచ్ఛంద సేవచేసే ఔత్సాహికులతో తయారుచేయబడింది.

మా పుస్తకాలు ఉచితంగా చదువుకోవటానికి అందచేస్తాము. చాలావరకు స్వేచ్ఛా నకలుహక్కులుగల పుస్తకాలు మాద్వారా లభిస్తాయి. స్వేచ్ఛానకలుహక్కుల పుస్తకాలను(వాణిజ్య అవసరాలకొరకు కూడా) ఈ Creative Commons Attribution-ShareAlike 3.0 Unported [2]లేక GNU FDL[3]నియమాలకు లోబడి వాడుకోవచ్చు. ఈ పుస్తకం నకలుహక్కుల గురించి మరింత తెలుసుకోవటానికి వికీసోర్స్ లో చూడండి.

వికీసోర్స్ కొత్త సభ్యులకొరకు ఎప్పుడూ వేచివుంటుంది. ఈ పుస్తకం తయారీలో కొన్ని దోషాలు చేరివుండవచ్చు. మీరు వీటిని ఈ పేజీలో[4] తెలియచేయండి.

ఈ పుస్తకానికై క్రింది సభ్యులు కృషి చేశారు:

- Optimus578
- Asooryampasya
- Rajasekhar1961
- Knrao
- Arjunaraoc
- Kajasudhakarababu

